# గాంధీయం

[గాంధీజీ సూక్తులకు గేయానుసరణం]

డా॥ సి. నారాయణరెడ్డి




ప్రచురణ :
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్-సైఫాబాద్-హైదరాబాదు.

# తొలి పలుకు

గాంధీ మహాత్ముడు జీవించిన శతాబ్దంలో రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాలలో భారతదేశంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చినవి. అంతకు పూర్వం ఏ శతాబ్దిలోనూ సుదీర్ఘ భారత దేశచరిత్ర ఇన్ని మార్పులను చూచి ఉండలేదు. భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలన వేళ్ళు పాతుకపోయిన కాలంలో గాంధీ జన్మించినాడు. దేశ స్వాతంత్ర్యాన్ని కనులారా చూచి మరణించినాడు. అతని నాయకత్వంలో దేశంలో భయంతో వంచుకొన్న తలలు ధైర్యంతో పైకిలేచినవి; మూగవానికి మాటలు వచ్చినవి. నిరాయుధునికి కూడ ఆయుధం లభించినది. దానిముందు ఆంగ్లేయుల మరతుపాకులు ఎందుకూ కొరగాకుండా పోయినవి. అది ప్రపంచ ఆయుధాగారంలోనే సాటిలేని ఆయుధం; చంపకుండా విజయం సాధించడం దాని ప్రత్యేకత. ఇటువంటి అద్భుత ప్రత్యేకతల చరిత్రే గాంధీ చరిత్ర.

గాంధీ ప్రజలకోసం జీవించినాడు, ప్రజలకోసం కష్టాలనుభవించినాడు. ప్రజలకోసం మరణించినాడు. ఐతే గాంధీ గొప్పతనం తనదేశ ప్రజలను ప్రేమించడంలో, దేశ స్వాతంత్ర్య సమరంలో విప్లవాత్మకమైన నాయకత్వాన్ని వహించడంలో మాత్రమే లేదు. దేశభక్తుడుగానో, విప్లవాత్మక సంస్కర్తగానో మాత్రమే అతణ్ణి భావితరాల వారు తలచుకుంటారని చెప్పడానికి వీలులేదు. మానవుల అంతరాత్మలకు అతడు చేసిన ప్రబోధం నిఖిల విశ్వానికి సంబంధించినది. అతడు తన దేశప్రజల కోసమే ఎక్కువగా కష్టపడ్డాడంటే దానికి కారణం అతడు వారి మధ్య పుట్టడం, వారికష్టాలు, బాధలు అతణ్ణి కదలించడం. కాని అతడు విశ్వ మానవుడు. అతని జీవిత చరిత్ర నిఖిల మానవాళికీ పఠనీయం. తన దేశ ప్రజలు ఆయనను "జాతిపిత"గా గౌరవించినా, నిజానికి అతని స్థానం అంతకంటే ఉన్నతమైనది. అతని దృష్టిలో

భారతదేశ స్వాతంత్ర్యం ప్రపంచ బానిసదేశాల విముక్తి సాధనలో ఒకభాగం మాత్రమే.

సాంఘిక అసమానతలను తొలగించడంలోకూడ అతని కృషి తక్కువదేమీకాదు. దేశంలో శతాబ్దాల తరబడి పాతుకుపోయిన కుల తత్త్వాన్ని, అస్పృశ్యతను తొలగించడానికి అయన పాటు పడ్డాడు. అతని దృష్టిలో స్వాతంత్ర్యం అంటే కేవలం రాజకీయ స్వాతంత్ర్యమే కాదు. సాంఘిక, నైతిక, ఆర్థికాది రంగాలన్నింటిలో మనిషికి విముక్తి లభించి నప్పుడే అది పరిపూర్ణ స్వాతంత్ర్యమౌతుంది. స్వాతంత్ర్య సాధనవైపు పయనిస్తూనే ప్రస్తుత సమకాలిక సమాజ స్థానంలో అవతరించ వలసిన కొత్తసమాజానికి అతడు బాటలు వేసి నాడు. ఈ దృష్టిలో అతని మృత్యువు కూడా ఒక గొప్ప విజయమే. కుల, మత ప్రాంత విభేదాల నుండి కోలుకొని భారతదేశం లౌకిక ప్రజాస్వామిక దేశంగా రూపొందడమే ఆ విజయం.

గాంధీ కొన్ని ప్రత్యేకమైన విశ్వాసాలతో జీవించిన వాడే. కాని అతడు ప్రత్యేకమైన మతాన్ని దేన్నీ స్థాపించ లేదు. తను ఏ మతంలో జన్మించినాడో ఆమతానికి విశ్వాసపాత్రుడై, తనమార్గంలో దానికి జీవి తాన్నర్పించినా, విశ్వజనీనమైన నైతిక సూత్రాలకూ, మానవ సంబం ధాలకూ అడ్డువచ్చే ఏ మౌఢ్యాన్నైనా ఏమాత్రం సమాధాన పడకుండా నిర్భయంగా ఖండించినాడు. జోసెఫ్ డోక్ అనే బాప్టిస్టు చెప్పినట్టు ఏ ఒక మత సంప్రదాయమూ అతణ్ణి లోబరచుకోలేదు. నిజం చెప్ప వలెనంటే అతని ఉద్దేశ్యాలు క్రైస్తవ మతానికి కూడ సన్నిహితంగా ఉంటవి. అతనివి విశాల భావాలు. మతవిషయంలో వర్గాలుండటం అర్థ రహితం అనేంత ఎత్తుకు ఆయన ఎదిగినాడు. అందుకే అతడు ఒక దేశానికి చెందినవాడు కానట్టుగాక, ఒక మతానికి చెందినవాడు కూడకాదు. అతడు స్వయంగా చెప్పుకొన్నట్టు 'గాంధీజం' వంటి ప్రత్యేకమైన

'ఇజాన్ని' స్థాపించడం కూడా అతని లక్ష్యంకాదు. శాశ్వత సత్యాలను నిత్యజీవిత సమస్యలతో అన్వయించడానికి మాత్రమే అతడు ప్రయత్నించినాడు. కాబట్టే అతడు మూర్తీభవించిన సత్యం. నైతిక సమగ్రతకు ప్రతిరూపం.

గాంధీజీ బహుకార్య వ్యగ్రుడైనా సేవా గ్రామంలో ఆశ్రమవాసుల కష్ట సుఖాలను తెలుసుకుంటూ, బాధలలో ఉన్నవారిని ఓదారుస్తూ ఉండేవాడు. ఆనంద, టి. హింగోరాని గాంధీ ఆశ్రమవాసులలో ఒకడు. అతనిభార్య విద్యాదేవి మరణించినప్పుడు గాంధీ అతణ్ణి ఓదార్చటానికి, ధైర్యం కలిగించటానికి రోజూ ఒక కాగితం ముక్కమీద కొన్ని అభిప్రాయాలు, సూక్తులు వ్రాస్తూ ఉండేవాడు. ఆనందుడు గాంధీ సూక్తులు చదవడానికి బాగా అలవాటు పడి పోయినాడు. ఒకసారి ఆనందుడు భీమవరంలోని ప్రకృతి చికిత్సాలయంలో చికిత్సకోసం వెళ్తూ తనకు రోజూ ఒక సూక్తి వ్రాసి పంపిస్తూ ఉండమని కోరినాడు. అతనికోరిక ననుసరించి గాంధీ సుమారు రెండు సంవత్సరాలు (20 నవంబరు 44 నుండి 10 అక్టోబర్ 46 వరకు) వరుసగా రోజూ ఒక సూక్తి వ్రాస్తుండేవాడు. ఆసూక్తులు మానవ జీవిత సత్యాలకు ప్రతిబింబాలు. అవి అతని విలక్షణ మైన బుద్ధికీ, నిర్మలశీలానికీ ప్రతీకలు; బుద్ధి క్షీరసాగరాన్ని మథించి తీసిన వెన్న ముద్దలు. అవి ఆనందునికే కాదు, భారతీయులకే కాదు, నిఖిల మానవాళికీ ప్రాతః పఠనీయాలు.

'గాంధీయం' అనే ఈ కృతి గాంధిజీ, సూక్తులకు డా॥ సి. నారాయణరెడ్డిగారి గేయానుసరణ-తెలుగు పాఠకలోకానికి నారాయణరెడ్డి గారిని పరిచయం చేయవలసిన అవసరం లేదు. ఈ తరము తెలుగు కవులలో ప్రథమశ్రేణికి చెందిన వారుగా వారు సకలాంధ్రానికి సుపరిచితులు. పండితులుగా, విమర్శకులుగా, వక్తలుగా, తెలుగుసీమలో వారిది సమున్నత స్థానం. రెడ్డిగారు మాత్రా ఛందస్సులో కూడా మంచి

కావ్యాలు రచింప వచ్చునని "నాగార్జున సాగరం" "కర్పూర వసంత రాయలు" "విశ్వనాథ నాయకుడు" మొదలైన గేయకావ్యాల ద్వారా నిరూపించి ఆంధ్ర సాహిత్యంలో కథాత్మక గేయ కావ్యాలకు ఒక ప్రత్యేక స్థానాన్ని గడింపజేసిన కవి వరేణ్యులు-ఈ గాంధీయం దీర్ఘ కావ్యం కాదు. వీనిని ప్రత్యేక భావాలు గల గేయముక్తకాలని అన వచ్చు. గాంధీ అభిప్రాయాలను సులభమైన భాషలో, ద్విపాద, చతు ష్పాద గేయాలలో నారాయణ రెడ్డిగారు చక్కగా పొదిగినారు. మచ్చుకు:-

"జనన మరణములు నాణెమ్మున కిరుప్రక్కలవంటివి ;
ఇది యెరిగిన వానికి ఇం కెక్కడి సుఖదుఃఖ స్థితి ?"

"మధువన్నది క్షణకాలము మనిషికి మరులెత్తించును ;
మదమన్నది మనిషినే అమాంతముగా కబళించును"

"సులభము దేశముల నడిమి జలరాశుల నీదుట
అతికష్టము నరుల నడిమ అంతరాలు దాటుట"

"మచ్చలేని దరహాసము మాటకన్న మహనీయము".

ఈ తెనిగింపు నారాయణరెడ్డి గారు తమ సహజ సుందర శైలిలో కొనసాగించి సొంతరచన అన్న భ్రమను కలిగింప జేస్తున్నారు.

ఈకృతిని గాంధీశతజయంత్యుత్సవ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆంధ్ర ప్రజానీకానికి సమర్పిస్తున్నది. కోరగానే దీనిని ముద్రించడానికి అనుమతించిన డా॥ సి. నారాయణరెడ్డి గారికి అకాదమీ పక్షాన కృతజ్ఞతలు- ఈకృతి ప్రజానీకానికి ప్రాతః పఠ నీయం కాగలదని ఆశిస్తున్నాము.

హైదరాబాదు :
సౌమ్య విజయదశమి
20-10-1969

దేవులపల్లి రామానుజరావు

స్తుతి గీతి

# బాపూ నీ పుట్టిన రోజు

బాపూ నీ పుట్టిన రోజు
భగవానుడు పుట్టిన రోజు
ఒక రాముడు పుట్టిన రోజు
ఒక రహీము పుట్టిన రోజు.

చావులేని పుట్టుకలేని
సత్యమూర్తి పుట్టిన రోజు.
దాస్యంలో విలవిలలాడే
ధర్మం తొడగొట్టిన రోజు.

కుత్సితాల కులమతాల
కోటలు పడగొట్టిన రోజు.
చురకత్తుల గుండెల్లోన
చిరునవ్వులు మెట్టిన రోజు.

దొరలకు శిరసొగ్గని రోజు
మరలకు మనసివ్వని రోజు.
చరఖాతో భారతమాతకు
పరువును నిలబెట్టిన రోజు.

సత్యాగ్రహ మంత్రం వింటూ
సంకెళ్లను ఛేదించుకుంటూ
నోరులేని వీర సంతతి
హోరున గీపెట్టిన రోజు.

ఆలయాన దాగిన దేవుని
అస్పృశ్యులు ముట్టిన రోజు.
హరి–జనుడై పుట్టిన రోజు
హరిజనుడే పుట్టిన రోజు.



1

నిఖిల జీవులందు తానె
నెలకొని ఉన్నానని ;
ఈశ్వరుడే తెలుపగ ఇం
కెవరిపైన మన పగ ?

2

బిందువు లోకటిగ చేరిన
సింధువుగా రూపొందును.
వ్యక్తు లొక్కటైన స్నేహ
వారాశులు ఉప్పొంగును.

౩

జనన మరణములు నాణె
మ్మున కిరుప్రక్కల వంటివి.
ఇది యెరిగిన వానికి ఇం
కెక్కడి సుఖదుఃఖ స్థితి ?

4

కనులను పోగొట్టుకొన్న
మనుజుండా గ్రుడ్డివాడు ?
తన తప్పులు కప్పిపుచ్చు
కొనువాడే జాత్యంధుడు.

5

నశ్వరులగు వైద్యుల వెం
ట భ్రమించెదు పామరుడా!
మరువబోకు ఉన్నాడని
మహావైద్యు డొకడు పైన.

6

చెమటోడ్చనిదే ఇలపై
సిద్ధించదు ఏ లక్ష్యము.
తపియించనిదే ఆత్మ
క్షాళనమ్ము దుస్సాధ్యము.

7

స్వచ్ఛమైన సంకల్పము
చతికిలబడి పోదు.
అచ్ఛమైన వాక్కు కడకు
అప్రియమ్ము కాదు.

8

దారుణ సూర్యాతపమ్ము
తలదాలిచి ; ఆశ్రితులకు
చలువల నందించెడు వృ
క్షమ్ము సదా స్మరణీయము.

9

మధువన్నది క్షణకాలము
మనిషికి మరులెత్తించును.
మదమన్నది మనిషినే అ
మాంతముగా కబళించును.

10

స్వార్థమ్మేనాటికైన
పరమార్థ మ్మౌనా ?
గుంటనక్క ఎన్నడైన
కొదమ సింగ మౌనా ?

11

బ్రహ్మాండము అణువులోన
భాసించిన రీతి ;
భరతావని పల్లెలలో
పాదుకొన్న దోయి.

12

ప్రతి నరునికి కాలగతిని
ప్రాప్తించును బడుగుతనము.
కాంక్షకు మాత్రము నిలుచును
కలకాలము పడుచుదనము.

13

దొంగిలించు నొక్కఁడు ; అం
దుకు తోడ్పడు నింకొక్కఁడు ;
ఎత్తువేయు మరియొక్కఁడు ;
ఈ ముప్వురు దొంగలే.

14

మనము బాటసారులమని
అనెను ఒకానొక సన్ముని.
ఇది సత్యము ; కొన్నాళ్ళకు
ఇంటికి మరలుట తథ్యము.

15

వికృత చిత్త వృత్తి నిరో
ధకము రామనామ స్మృతి.
అది కంఠమునుండి కాదు
ఎదతో పలికిన సద్గతి.

16

నరుని గుండె నిబ్బరమును
పరీక్షించు గీటురాయి
మంచుకొండ అంచుకాదు ;
మానవ సంఘమ్మోయి.

17

వికృతిలేని దైవానికి
ముకుర ప్రాయులము మనము.
అద్దమ్మును బట్టికదా
అందులోని ప్రతిబింబము.

18

విద్యలేని మనుజుడు పశు
వేయని అన్నాడొక కవి.
ఇంతకు ఆ విద్య యేదో
ఎరిగించిన బాగుండును.

19

సులభము దేశముల నడిమి
జలరాశుల నీదుట.
అతికష్టము నరుల నడిమి
అంతరాలు దాటుట.

20

అలరించుము దేవుని ; కొని
యాడుము ఆ మహనీయుని.
తొలగిపోవునంతట ని
స్సలమిన చింతలు వంతలు.

21

అరసిచూడ ఒక విషయము
స్ఫురియించెను ; ఏమని ?
స్వర్గము గగనానలేదు
జగతిపైన కలదని.

22

సత్యమ్మొకవంక విశ్వ
సామ్రాజ్యమ్మొక్కవంక
నిలిపిన ; సత్యమ్మే వర
ణీయమౌనులే మనసా !

23

గంగానది నరుని అంత
రంగమ్మున ప్రవహించగ
అందు పునీతుండు గాక
అజ్ఞుండై తిరుగునతడు.

24

సత్యవ్రతునికి నిందా
స్తవములు తుల్యమ్ములు.
పొగడిన అతడుబ్బిపోడు.
తెగదిట్టిన ఉరిమిపడడు.

25

ఏది జీవితమ్ము? కేవ
లేంద్రియ తర్పణము కాదు.
జీవితమనగా ఈశ్వర
భావన; మానవసేవన.

26

తనలో మిడుకుచు చేసిన
త్యాగము త్యాగమ్ము కాదు.
అచ్చమైన త్యాగమ్ము ; మ
హోచ్చస్థితి దాయకమ్ము.

27

అంతరంగ సింహాసన
మందు ఒకే కాలమ్మున
ప్రతిష్ఠించ వీలుపడదు
పరమాత్మను పిశాచమును.

28

చౌర్యముకన్నను, వేశ్యా
సంపర్కముకన్నను, మధు
పానము కడు హేయము ; అది
పై రెంటికి మూలము.

29

మాసిపోవు దోషము ఆ
త్మజ్ఞతతో దిద్దుకొన్న.
వ్రణమై అది ఉబికివచ్చు
తనలోనే అణచుకొన్న.

30

నిరుపేదకు ఉప్పైనా
దొరకలేని చోటు ;
రామరాజ్యమని పలికెద
రా? పేదవులచేటు.

31

తీగవోలె తరువు నంటి
సాగుట పరతంత్రత.
నిటారుగా నిలబడి పయ
నించుట స్వచ్ఛందత.

32

కత్తిని ఝళిపించి కూడ
గట్టుకొన్న శక్తి వృథా.
నిక్కమైన శక్తి సత్య
నిహితమైనదే కదా !

33

గులాబీని ఏపేరున
పిలుచుకొన్న గానీ ;
అది సహజ పరిమళమ్ము
వదల దెన్నడేని.

34

భగవంతునిలో విచిత్ర
పరుసవేది కలదు.
ఇనుమైనా అతని ముందు
కనకము కాగలదు.

35

శాంతిని సాధించుకొనగ
జంతుబలము పనికిరాదు.
అనురాగమ్మును మించిన
ఆయుధమ్ము వేరులేదు.

36

లేశమైన అనృతమైన
నాశమొనర్చు మనిషిని.
ఒక్క విషపుచుక్క పడిన
చిక్కనిపాల విధమ్మున.

37

వ్యర్థపదము సైతము స
త్య పదార్థ వినాశకమ్ము.
మౌనమ్మే సత్యవ్రత
మహిత మార్గదర్శకమ్ము.

38

కణమాత్రమైన ప్రేమ
కలుగనివాడు దరిద్రుడు.
తనలో విశ్వమ్మును పొది
గినవాడే సంపన్నుడు.

39

పాపబుద్ధి చీకటిలో
పడగెత్తును.
పాలవెలుగు సోకగ అది
పరుగెత్తును.

40

జీవితమ్ము గులాబి
పూవు వంటిది సుమా !
రెంటిమాటున కలవు
కంటకములు.

41

మృత్యు వనగానె బెం
బేలు పడనేలా ?
బాధా విముక్తి కది
సాధనము కాదా !

42

ముఖము తప్పించెదము
ముప్పు చేసిననాడు.
ఊరంత చాటెదము
ఒప్పు చేసిననాడు.

43

సహచరులు లేరను వి
చారమ్మదేలా ?
సర్వేశ్వరుండు నీ
సహచరుడు కాడా ?

44

కన్నొక్కతీరు ; నా
ల్కమరొక్కతీరు ; మన
సింకొక్క తీరు వ
ర్తించు వా డేబ్రాసి.

45

అందరు గురువు లైన
అపుడు శిష్యులు ఎవరు ?
అందుకే ఔదాము
అందరము శిష్యులము.

46

తన తప్పు గోరంత
తదితరుల దోషమ్ము
కొండంత యనుకొనుట ;
కూపమున దిగబడుట.

47

ఒక్క చిరునవ్వుతో
దుఃఖములు మాయవా ?
బొబ్బ పెట్టిన వెతలు
ఇబ్బడించును సుమా !

48

ప్రతివస్తువున కుభయ
పార్శ్వములు కలవు.
వెలుగున్న ప్రక్కనే
తిలకించ దగును.

49

బడబాగ్ను లెన్నెన్ని
ఎడద నుడికించినా ;
సాగరుడు తనలోని
చలువ కోల్పోవునా ?

50

మనుజులకు పశువులకు
మధ్య అంతరమెంత ?
ఇది గ్రహించిన అంత
రించును ఆరని చింత.

51

జపమాల త్రిప్పుటే
చరమ లక్ష్యము కాదు.
దాని పరమార్థమ్ము
దైవసాన్నిధ్యమ్ము.

52

అరిగిన ప్రతిక్షణము
తిరిగి రాదని తెలిసి
ఎంత సమయమ్ము వె
చ్చించుచుందుము మనము.

౫౮

తనువు క్షణభంగుర
మ్మని తెలియునందరకు.
అది తెలిసి ఇంకను అ
హంకార మెందులకు ?

54

పుట్టెడు మట్టిని త్రవ్వి ఒక్కమణి
పొందగలిగితివి గానీ ;
సత్యరత్నమును సాధించగ కా
సంత పాటుపడవేమి ?

55

మతములన్ని శ్రేష్ఠములు ; ధ
ర్మమ్ములన్ని గరిష్ఠములు ; మరి
వెలితి ఎవరిది ? వాని విలువలు
తెలియజాలని నరులది.

56

ఇంకిపోవును గంగయైనను
ఎపుడు తనమూలమ్ము వీడునా.
ఆరిపోవును ఆత్మ ఆ పర
మాత్మ కెపుడది దూరమౌనో.

57

ఆత్మ మేల్కొనగ దుఃఖము
లన్ని పటాపంచ లౌను.

58

బ్రతుకు పలక తుడిచిన కన
బడు దేవుని హస్తాక్షరి.

59

సేవా సంసక్తమైన
జీవనమ్ము పావనమ్ము.

60

దురహంకారము సమస్త
దుఃఖములకు మూలము.

61

'పైసా పరమేశ్వరు' డను
పలుకు వట్టి గాలిపోగు.

62

అన్ని మరువవచ్చు దైవ
మన్నది గుర్తున్న చాలు.

63

ఎదతలుపులు తెరచినచో
పదమిడు పరమేశ్వరుండు.

64

వేరువిడిచి కొమ్మల న
న్వేషించుట వెఱ్ఱితనము.

65

ఒకనికి చెయి సాచుట తన
కున్న స్వేచ్ఛ అమ్ముకొనుట.

66

అలవికాదు అత్యుక్తుల
వలను దాట అర్జునికైన.

67

దేహతత్త్వ మెరిగిన పృ
థ్వీతత్త్వము నెరుగవచ్చు.

68

వెరపెందుకు ? ప్రతినిమిషము
పరమాత్ముడు భాసించగ.

69

ఇనుపగోడనైన చీల్చు
కొనిపోవును ఆలోచన.

70

మంచిమనసు వెలువరించు
మాట పొల్లు పోదెన్నడు.

71

మచ్చలేని దరహాసము
మాటకన్న మహనీయము.

72

పరికింతు అనుక్షణమ్ము
నరుని ఆత్మవంచనమ్ము.

73

జీవనలయ ననుసరించు
జీవి అలసిపోడెన్నడు.

74

నిత్యసత్య పథమున పయ
నించువాడు జారిపడడు.

75

పితూరీలు వినకు
విన్నా ఔననకు.

76

ఏమిలేనివానిని ఇం
కెవడయ్యా దోచేది?

77

మంచివారి సహవాసము
మనసుకు సరిపడు గ్రాసము.

78

అహంకార మంతరించ
అంతరాత్మ మేలుకొనును.

79

మౌనము రుచియించ దివ్య
గానము వినిపించునయా !

80

కోపమెవరిపై ? తనపై.
కూడదు అది ఇతరులపై.

81

వినకు స్తుతిపాఠములు
వినుము నిజలోపములు.

82

ఆత్మదీపము వెలుగ
అఖిల లోకము వెలుగు.

83

లోకవంచితుడు ఆ
లోకేశ్వరుని హితుడు.

84

ఒరుల బరువును దించు
నరుడెపుడు సార్థకుడు.

85

పాపమెన్నడు దాగలేనిది
పాపిముఖమున ముద్రితమ్మది.

86

అహంకారపు చిమ్మచీకటి
అణగిపోవును వినయకాంతికి.

87

పశుబలమునకు లొంగిపోవుట
పౌరుషమ్మును కోలుపోవుట.

88

ఏమి కావలె? దివ్యలోకము
లెల్ల నీలో ఒదిగియుండగ.

89

మాతృభాషా తృణీకారము
మాతృదేవీ తిరస్కారము.

90

ఒంటపట్టని చదువులు
ఉత్త చిలుకల పలుకులు.

91

బుద్ధులను సరిదిద్ద జాలని
విద్దెలెందుకు ? కాల్చనా !

92

ఈశ్వరుడు చుక్కాని ; మరి ఆ
ఈశ్వరుండే కర్ణధారి.

93

వ్యక్తిత్వము కోల్పోయినచో స
ర్వము కోల్పోవును మానవుడు.

94

గుండెబలముతో పురోగమించిన
కొండలైన దాటును నరుడు.

95

మిడిమిడి తెలివికి జడియుట మంచిది.
అమృత సత్యమున కతిదూరమ్మది.

96

అలజడితో చల్లారదు అలజడి
మౌనమ్మొకటే దాని సణచునది.

97

నరుడు నరుని పరిమార్చుచుండగా
పరమేశ్వరుడే నిలుచు అండగా.

98

అన్నరూపమున అగుపడు ; ఆకలి
గొన్నవాని కీశ్వరుడు.

99

తను తానెరిగిన
మనుజుడు ముక్తుడు.

100

సహన ఫలమ్ములు
స్వాదుతరమ్ములు.



# बापू की सूक्तियाँ

१. जब भगवान् निज मुख से कहते हैं कि वे सब प्राणी में विहार करते हैं तो हम किस से वैर करें ?

(आज के भजन का अनुवाद) ४-१२-१९४४

२. जैसे बिन्दु का समुदाय समुद्र है, इसी तरह हम मैत्री करके मैत्री का सागर बन सकते हैं और जगत् में सब एक दूसरों से मित्र भाव से रहें तो जगत का रूप बदल जाय।

२४-१२-१९४४

३. (क्या) जन्म और मरण शायद एक ही सिक्के की दो बाजू नहीं हैं ? एक तरफ देखो तो मरण और दूसरी तरफ जन्म। इसमें दुःख क्यों ? हर्ष क्यों ?

४-१-१९४५

४. अंधा वह नहीं जिसकी आंख फूट गई हो। अंधा वह है जो अपने दोष ढांकता है।

१०-४-१९४५

५. आश्चर्य है वैद्य मरते हैं, डाक्टर मरते हैं, उनके पीछे हम भटकते हैं। लेकिन राम जो मरता नहीं है, हमेशा जिन्दा रहता है और अचूक वैद्य है, उसे हम भूल जाते हैं।

३०-१२-१९४४

६. बगैर परिश्रम से, यानी बगैर तप के, कुछ भी हो नहीं सकता है, तो आत्मशोध कैसे हो सके?

१७-१-१९४५

७. सच्चा कार्य कभी निकम्मा नहीं होता, सच्चा वचन अन्त में कभी अप्रिय नहीं होता।

२३-१-१९४५

८. "वृक्षन् की मत ले" भजन मनन करने योग्य है। वह तपता है और हमको शीतलता देता है। हम क्या करते हैं?

१-१२-१९४४

९. मद्यपान मनुष्य को क्षण भर दीवाना बनाता है। मद उसे खा जाता है और उसे पता भी नहीं होता है।

२९-१०-१९४५

१०. स्वार्थ को जब मनुष्य परमार्थ मानता है, तब सियार को सिंह मानने जैसा करता है।

१७-१०-१९४५

११. जैसे पिंड में ब्रह्मांड है, ऐसे देहात में हिन्दुस्तान है।

१२-७-११४५

१२. सब अपने समय पर वृद्ध होते हैं। एक तृष्णा हमेशा युवा ही रहती है।

८-११-१९४५

१३. एक चोरी करता है, एक चोरी में मदद करता है, एक चोरी का इरादा करता है। तीनों चोर हैं।

२-९-१९४५

१४. ज्ञानी ने हमें मुसाफिर कहा है। बात सच्ची है। हम यहाँ तो चंद रोज़ के लिये हैं। बाद में "मरते" नहीं, अपने घर जाते हैं। कैसा अच्छा और सच्चा ख्याल।

१५-१-१९४५

१५. विकारी विचार से बचने का एक अमोघ उपाय-रामनाम-है। नाम कंठ से ही नहीं, किन्तु हृदय से निकलना चाहिये।

२८-१२-१९४४

१६. मनुष्य की शांति की कसौटी समाज में ही हो सकती है, हिमालय की टोच (चोटी) पर नहीं।

११-४-१९४५

१७. ईश्वर तो एक ही है और हमेशा एक रूप या अरूप है। हम उसका आईना हैं। अगर हम सीधे हैं, तो वह सीधा दीखता है। हम टेढ़े हैं, तो वह भी टेढ़ा लगता है। इसलिये हम हर तरह स्वच्छ ही रहें।

७-७-१९४५

१८. कवि ने कहा है कि विद्यारहित मनुष्य पशु समान है। वह विद्या कौन सी ?

३०-९-१९४५

१९. देशों के बीच का समुद्र तैरना आसान है, व्यक्ति के बीच या प्रजा के बीच का समुद्र तैरना कठिन है।

६-११-१९४५

२०. खुश करना तो खुदा को, खुशामद करना तो भी उन्हीं की, तो हम सब चिंता और झंझट से छूट जाते हैं।

२-६-१९४५

२१. अगर ध्यान से देखें तो पृथ्वी पर स्वर्ग छाया हुआ है, आकाश में नहीं।

७-३-१९४६

२२. एक तरफ सत्य और दूसरी तरफ जगत का राज्य। तो, हे मन, तू सत्य पसंद करेगा, जगत का राज्य फेंक देगा।

नई दिल्ली, १८-५-१९४६

२३. मनुष्य के भीतर ही गंगा पड़ी है। उसमें स्नान नहीं कर पाता और कोरा रहता है।

सेवाग्राम : शुक्र २३-८-१९४६

२४. सत्य के उपासक के लिये स्तुति और निन्दा एक ही होनी चाहिये। इस वास्ते वह स्तुति सुनेगा नहीं और निन्दा से गुस्सा नहीं करेगा।

उरुली : शनिवार ३-८-१९४६

२५. जीना मानी मौज करना-खाना, पीना, कूदना-नही लेकिन ईश्वर की स्तुति करना अर्थात् मानव जाति की सच्ची सेवा करना।

१७-२-१९४५

२६. जो मनुष्य त्याग करता है और दुःख मानता है, उसने त्याग किया ही नहीं है। सच्चा त्याग सुखद होता है, मनुष्य को ऊँचे ले जाता है।

२५-६-१९४५

२७. हमारे हृदय की गद्दी पर खुदा बैठे और शैतान भी, नहीं हो सकता।

नई दिल्ली : गुरुवार १२-९-१९४६

२८. शराब को मैं चोरी और शायद वेश्यागामिता से भी अधिक निंदनीय मानता हूँ। क्या वह प्रायः इन दोनों की जन्मदात्री नहीं है।

(२–बी)

३७. निकम्मा शब्द भी सत्य का भंग करता है। यही कारण है कि मौन से ही सत्य का पालन आसान बन सकता है।

२१-५-१९४५

३८. दरिद्र वह है जिसमें शुद्ध प्रेम की बूंद तक नहीं है। धनवान वह, जिसके प्रेम में जन्तु से लेकर मस्त हाथी तक समा सकता है।

(१३-बी)

३९. अवगुण अंधेरे में फलता है, प्रकाश में गायब हो जाता है।

२१-१०-१९४५

४०. जिंदगी गूलाब के समान मनाई जाती है। जिंदगी में भी काँटा भरा है, इसलिये।

७-५-१९४५

४१. क्या मौत हर हालत में अति दुःख से मुक्ति नहीं है ? अगर है, तो शोक क्यों ?

६-५-१९४५

४२. जब आदमी कुछ बुरा काम करता है तो शरमिन्दा होता है। जब अच्छा करता है तो जाहिर होना चाहता है। क्यों ?

२८-५-१९४५

४३. जिसका साथी ईश्वर है उसको दुःख क्या, फिकर क्या, दूसरा साथी क्या ?

पूना : २०-३-१९४६

४४. जिसकी आंख एक कहती है, जीभ दूसरी, हृदय में तीसरी चीज़ है, वह घर-फूटा है, निकम्मा है।

पूना : १७-३-१९४६

४५. सब शिक्षक बनें तो शिष्य कौन बनेगा ? इसलिये हम सब शिष्य बनें ।

दिल्ली : १३-४-१९४६

४६. जो मैं करता हूँ वह छोटा दोष है, और दूसरे करते है वह बड़ा दोष है-ऐसे माननेवाला अज्ञान कूप मे पड़ा है ।

३-९-१९४५

४७. आदमी अपना दुख हँस कर भूल जाता है । रो कर बढ़ाता है ।

दिल्ली : १-४-१९४६

४८. जब हम जानते हैं कि एक वस्तु की दो बाजू हैं, तो हम सफेद को देखें ।

न. दि. : १६-६-१९४६

४९. समुद्र में कितना भी तूफान होता है, तो भी समुद्र अपनी शांति नहीं छोड़ता है ।

पूना : २९-७-१९४६

५०. मनुष्य जीवन और पशु जीवन में फ़रक क्या है ? इसका सम्पूर्ण विचार करने से हमारी काफी मुसीबतें हल होती हैं ।

१८-२-१९४५

५१. माला लें, उसे संत ने फिराई है, वह तुलसी या सुखंड की है, रुद्राक्ष हो, लेकिन फेरनेवाला यदि माला में ही सर्वस्व है ऐसा मानता है, तो उसे फेंक दे । यदि माला उसे परमात्मा के नज़दीक ले जाती है, अपने कर्तव्य में सावधान करती है, तो भले उसे विधिवत लें और फिरावें ।

२३-२-१९४५

५२. एक भी मिनट फिजूल जाती है तो वापिस कभी नहीं आती है । यह बात जानते हुए हम कितनी मिनट गंवाते है ।

२०-५-१९४५

५३. यह शरीर क्षणभंगुर है। आज है, कल नहीं। अभी है, दूसरे क्षण नहीं। तो उसका मैं अहंकार करूँ ?

(१४–बी)

५४. हज़ारों मन कचरा बडे परिश्रम से निकालते हैं तब कोई हीरा हाथों में आता है। क्या हम इस परिश्रम का थोड़ा हिस्सा कचरा रूप झूठ निकालने में और हीरा रूप सत्य ढूंढने में देते हैं ?

१६-१-१९४५

५५. सभी मज़हब अच्छे हैं। जितने भी धर्म हैं सबके सब ऊँचे हैं। धर्म में कसर नहीं है कसर तो उनके आदमियों में है।

(५–बी)

५६. गंगा कब सूखेगी ? जब अपने मूल को छोडे तब। ऐसे आत्मा जब परमात्मा से छूट जाय, तब ही सूख सकती है।

पूना : ४-३-१९४६

५७. आत्मा जागती है, तब सब दुःख दूर होता है।

उरुली : ३०-३-१९४६

५८. जब हम पाटी साफ करते हैं, तो उस पर ईश्वर के हस्ताक्षर स्पष्ट देखते हैं।

नई दिल्ली : मंगल १०-९-१९४६

५९. जो जीवन सेवा में व्यतीत होता है वही फलदायी है।

नई दिल्ली : सोम १६-९-१९४६

६०. आपखुदी में सब मुसीबत भरी है।

नई दिल्ली : सोम २३-९-१९४६

६१. "पैसा परमेश्वर है"-ऐसा कहना गलत बात है, और गलत सिद्ध हो चुका है।

२५-९-१९४५

६२. जो ईश्वर को याद करता है, वह दूसरा सब भूल सकता है।

२४-८-१९४५

६३. जब आदमी अंतर खाली करता है, तब ईश्वर वह खाली जगह भरता है।

दिल्ली : ७-४-१९४६

६४. मूल को छोड़कर जो डाल खोजता है, वह भटकता है।

मुंबई : ८-७-१९४६

६५. किसी की मेहरबानी मांगना अपनी आजादी बेचना है।

२-२-१९४५

६६. अतिशयोक्ति की जाल में से आदमी छूट नहीं सकता हैं, ऐसा प्रतीत होता है।

सेवाग्राम : मंगल २०-८-१९४६

६७. हमारे शरीर का हमें सच्चा ज्ञान हो जाय तो पृथ्वी का भी सच्चा ज्ञान हो जाय।

(४–बी)

६८. मुझे तो ईश्वर के बारे में हर घड़ी प्रतीति होती है। फिर किसी से डरना क्या ?

२९-६-१९४५

६९. विचार लोखंड की दीवार को भी भेदता है।

नई दिल्ली : ५-९-१९४६

७०. शुद्ध हृदय से निकला हुआ वचन कभी निष्फल नहीं होता।

२४-१-१९४५

७१. कृत्रिम नहीं, लेकिन स्वाभाविक हास्य भव्य भाषण है और भाषण से ज्यादा काम देता है।

१६-५-१९४५

७२. मनुष्य अपने को कैसे धोखा देता है, इसको मैं प्रतिक्षण पाता हूँ।

३१-५-१९४५

७३. जो जीवन के सुर में चलता हैं, उसे कभी थकान नहीं होगा ।

८-३-१९४६

७४. जो हमेशा सत्य के पथ पर ही चलता है, वह कभी गिरता नहीं।

९-३-१९४६

७५. अफवाह सुनना नहीं, सुनना तो मानना नहीं।

४-७-१९४५

७६. जब मनुष्य आकाश के नीचे सोता हैं, तो उसे कौन लूट सकेगा ?

दिल्ली : २-४-१९४६

७७. हम सत्संग ढूंढते हैं क्योंकि हमारी आत्मा के लिये वही खुराक है।

ट्रेन में : १७-२-१९४६

७८. आप मरने से आत्मा जागती है।

उरुली : २९-३-१९४६

७९. जिसे मौन आ गया है, वह अंत में दिव्य संगीत सुनने लगता है।

(१६-बी)

८०. गुस्सा किस पर करना ? अपने पर ? यह तो रोज़ करो। दूसरों पर ? यह तो करने का कारण ही क्यों ?

नई दिल्ली : ३०-८-१९४६

८१. अपना ऐब हमेशा सुनें, अपनी स्तुति कभी न सुनें।

५-७-१९४५

८२. अगर भीतरी बत्ती जले तो सारे जगत को प्रकाश देती है।

नई दिल्ली : २४-८-१९४६

८३. जब जगत हमें गिराता है, तब ईश्वर हमारा बेली होता है।

सेवाग्राम : ७-२-१९४६

८४. जो मनुष्य किसी का भी बोझ हलका करता है वह निकम्मा नहीं है।

३०-१-१९४५

८५. गुनाह छिपा नहीं रहता। वह मनुष्य के मुख पर लिखा रहता है। उस शास्त्र को हम पूरे तौर से नहीं जानते, लेकिन बात साफ़ है।

२८-२-१९४५

८६. इस अहंकार रूपी अंधकार को कैसे निकाले? रजवत् होने तक की नम्रता रूपी प्रकाश से।

२६-७-१९४५

८७. बलात्कार के वश होना नामर्दी की निशानी है।

नई दिल्ली : मंगल २७-८-१९४६

८८. जब आकाश तेरे में भरा है और ईश्वर तो उसमें है ही, तो तुझे और क्या चाहिये ?

नई दिल्ली : २७-४-१९४६

८९. जो मातृभाषा की अवगणना करता है, वह अपनी माता की करता है।

१३-९-१९४५

९०. कंठस्थ ज्ञान की इतनी कीमत है जितनी तोता के रामनाम की।

१२-६-१९४५

९१. जिस तालीम का असर हमारे चरित्र पर नहीं होता है, वह कुछ काम की नहीं है।

सोदपुर : ७-१-१९४६

९२. ईश्वर हमारा सुकान है और ना खुदा भी ।

दिल्ली : १२-४-१९४६

९३. जिसने अपनापन खोया, उसने सब खोया ।

१०-१२-१९४४

९४. श्रद्धा से मनुष्य पहाडों को उल्लंघन करता है

७-१२-१९४४

९५. मिथ्या ज्ञान से हम हमेशा डरते रहें । मिथ्या ज्ञान वह है जो हमको सत्य से दूर रखता है या करता है ।

२-१२-१९४४

९६. आवाज करने से आवाज नहीं मिटती है, चुपकी से मिटती है ।

शिमला : ६-५-१९४६

९७. जब मनुष्य मुझे मारता है, तब ईश्वर सहाय करता है।

न. दि. १८-६-१९४६

९८. जिसको रोटी न मिलने से मरना है उसे तो ईश्वर रोटी में ही देखने में आवेगा।

३०-११-१९४५

९९. जब मनुष्य अपने को पहचानता है, तब मुक्त है।

नई दिल्ली : १८-४-१९४६

१००. धर्म के फल मीठे होते हैं।

नई दिल्ली : २८-४-१९४६

